## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050018333

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్ పరబ్రహ్మణేనమః

# తర్పణ నిర్ణయము

చెల్లా - లక్ష్మీనృసింహ శాస్త్రి



ఓమ్ పరబ్రహ్మణేనమః.

# తర్పణనిర్ణయము.



ఆదౌశుద్ధజలేస్నాత్వాచమ్య - విధిప్రకారేణస్నానంకుర్యాత్॥ తతఃసంధ్యావందనబ్రహ్మయజ్ఞాదికంకృత్వా॥ తతఃదేవర్షిపితృతర్పణంకుర్యాత్॥ యథా॥ ఆచమ్య...ఏవంగుణ...పుణ్యాతిథౌ దర్శప్రయుక్త మహాపర్వణిపుణ్యకాలే - అథవా॥ (మకరసంక్రమణప్రయుక్త ఉత్తరాయణపుణ్యకాలే) అథవా... (చంద్రోపరాగ - సూర్యోపరాగమహాపుణ్యకాలే) దేవర్షిపితౄనుద్దిశ్యదేవర్షిపితృప్రీత్యర్థం ఆదౌదేవర్షిపితృతర్పణంకరిష్యే॥ ఇతిసంకల్ప్య॥ బ్రహ్మాదయోయేదేవాఃతాన్ దేవాగ్స్తర్ప...మి॥ సర్వాన్ దేవాగ్స్తర్ప...మి॥ సర్వాన్ దేవగణాగ్స్తర్ప...మి॥

సర్వాఃదేవపత్నీ స్తర్ప...మి॥ సర్వాన్ దేవపుత్రాన్ స్తర్ప...మి॥ సర్వాన్ దేవపౌత్రాన్ స్త...మి॥ భూర్దేవాన్ స్తర్ప...మి॥ భువర్దేవాన్ స్తర్ప...మి॥ సువర్దేవాన్ స్తర్ప...మి॥ భూర్భువస్సువర్దేవాన్ స్తర్ప...మి॥ (నివీతీ)కృష్ణద్వైపాయనాదయోమహాఋషయఃతానృషీన్ స్తర్ప...మితర్ప...మి॥ ౨॥ సర్వానృషీన్ స్తర్పయామితర్పయామి॥ ౨॥ సర్వానృషిగణాన్ స్తర్పయామితర్పయామి॥ ౨॥ సర్వాఃఋషిపత్నీ స్త...మి॥ ౨॥ సర్వానృషిపుత్రాన్ స్త...మి॥ ౨॥ సర్వానృషిపౌత్రాన్ స్త..మి॥ ౨॥ భూర్ ఋషీన్ స్త...మి॥ ౨॥ భువర్ ఋషీన్ స్త + మి॥ ౨॥ సువర్ ఋషీన్ స్త...మి॥ ౨॥ భూర్భువస్సువర్ ఋషీన్ స్త + మి॥ ౨॥ అథకాండర్షితర్పణం॥ ప్రజాపతిం కాండఋషింతర్పయామి తర్పయామి॥ సోమంకాండఋషిం త...మి॥ ౨॥ అగ్నింకాండఋషిం త...మి॥ ౨॥ విశ్వాన్ దేవాన్ కాండఋషీన్ స్త...మి ౨॥ సాగ్ంహితీర్దేవతాఉపనిషద స్త...మి॥ ౨॥ యాజ్ఞికీర్దేవతాఉపనిషద స్త...మి॥ ౨॥ వారుణీర్దేవతాఉపనిషద స్త.. మి॥ ౨॥ బ్రహ్మాణగ్గ్స్వయం

భువంత...మి॥ 3॥ సదసస్పతిం త...మి॥ 3॥ (ప్రాచీనావీతీ) సోమఃపితృ
మాన్యమోఽంగిరస్వానగ్నిష్వాత్తాఽగ్నిః కవ్యవాహనాదయో యే
పితరః॥ తాన్ పితౄగ్ స్వధానమ స్తర్పయామి తర్పయామి తర్పయామి॥ స
ర్వాన్ పితౄగ్ స్తర్పయామి...మి॥ 3॥ సర్వాన్ పితృగణాగ్ స్త...మి॥ 3॥
సర్వాః పితృపత్నీ స్త...మి॥ 3॥ సర్వాన్ పితృపుత్రాగ్ స్త...మి॥ 3॥ స
ర్వాన్ పితృపౌత్రాగ్ స్త...మి॥ 3॥ భూః పితౄగ్ స్త...మి॥ 3॥ భువః పితౄగ్
స్త...మి॥ 3॥ సువః పితౄగ్ స్త...మి॥ 3॥ భూర్భువస్సువః పితౄగ్ స్త...మి॥
3॥ అనేన దేవర్షి పితృ తర్పణేన భగవాన్ త్సర్వాత్మక...ఏతత్ఫలం శ్రీ
పరమేశ్వరార్పణమస్తు॥ ఆచమ్య॥ అథ నిత్యతర్పణం కుర్యాత్ ॥

అథ తిలతర్పణ ప్రయోగః.

ఆచమ్య॥...ఏవంగుణ... పుణ్యతిథౌ... ప్రాచీనావీతీ ॥ పితుః...పి
తౄణాం అక్షయపుణ్యలోక ఫలావాప్త్యర్థం...మహాపర్వణి పుణ్యకాలే
తిలతర్పణం కరిష్యే॥ ఇతి సంకల్ప్య॥ దక్షిణాభిముఖో భూత్వా ॥ పూర్వే

పితౄనావాహ్య॥ ఆయాతపితరస్సోమ్యాగంభీరైః పథిభిఃపూర్వ్యైః ప్ర
జామస్మభ్యం దధద్రయించదీర్ఘాయుత్వంచ శతశారదంచ॥ పితౄన్ కూ
ర్చే ఆవాహయామి॥ సకృదాచ్ఛిన్నం బర్హిరూర్ణామృదుస్స్యోనం పితృ
భ్యస్త్వాభరామ్యహమ్। అస్మిన్ త్సీదంతుమే పితరస్సోమ్యాః పితామ
హాః ప్రపితామహాశ్చానుగైస్సహ॥ ఇదమాసనం॥ తిలైస్సహోదక
మంజలినాగృహీత్వా॥ సవ్యంజాన్వాచ్య॥ అస్మత్పితరం + గోత్రం +
శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి స్వధానమస్తర్పయామి
స్వధానమస్తర్పయామి॥ ...పితామహం...గోత్రం...శర్మాణం రుద్రరూ
పం స్వధానమ + మి॥...ప్రపితామహం... గోత్రం...శర్మాణం ఆదిత్య
రూపంస్వ + + + మి॥ ...మాతరం...గోత్రాం ... పదాయీం వసు
రూపాంస్వ + + + మి॥ ...పితామహీం...గోత్రాం ... పదాయీం

రుద్రరూపాంస్వ + + మి॥...ప్రపితామహీం...గోత్రాం...వదాయీం
ఆదిత్యరూపాంస్వ + + మి॥ ...సపత్నిమాతరం... గోత్రాం ... వదా
యీంవసురూపాంస్వ + మి॥ ...జనకపితరం...గోత్రం...శర్మాణం వసు
రూపంస్వ + + + మి॥ ...జనకమాతరం...గోత్రాం ... వదాయీం
వసురూపాంస్వ + + మి॥ అస్మత్ మాతామహం...గోత్రం...శర్మాణం
రుద్రరూపంస్వ + + మి॥ మాతుఃపితామహం...గోత్రం ... శర్మాణం
రుద్రరూపంస్వ + + మి॥ మాతుఃప్రపితామహం...గోత్రం...శర్మాణం
ఆదిత్యరూపంస్వ + మి॥ మాతామహీం...గోత్రాం + వదాయీంవసు
రూపాంస్వ + మి॥ మాతుఃపితామహీం...గోత్రాం + వదాయీం రుద్ర
రూపాంస్వ + మి॥ మాతుఃప్రపితామహీం + గోత్రాం + వదాయీం
ఆదిత్యరూపాంస్వ + మి॥ ఆత్మపత్నీం + గోత్రాం + వదాయీం వసు
రూపాంస్వ + మి॥ సుతం + గోత్రం + శర్మాణం వసురూపంస్వ + మి॥
భ్రాతరం + గోత్రం + శర్మాణం వసురూపంస్వ + మి॥ పితృవ్యం +

గోత్రం + శర్మాణం వసురూపంస్వ + మి॥ మాతులం + గోత్రం + + ణం వసురూపంస్వ + + మి॥ దుహితరం + గోత్రాం + పదాయీాం వసురూపాంస్వ + మి॥ భగినీం...గోత్రాం + పదాయీాం వసురూపాం స్వ + మి॥ దౌహిత్రం...గోత్రం + శర్మాణం వసురూపంస్వ + మి॥ భాగినేయకం + గోత్రం + శర్మాణం వసు + స్వ...మి॥ పితృభగినీం... గోత్రాం...పదాయీాం వసురూపాంస్వ...మి॥ మాతృభగినీం...గోత్రాం ...యీాం...రూపాం...మి॥ జామాతరం...గోత్రం...ణం...పంస్వ...మి॥ భావుకం...గోత్రం...ణం...పంస్వ...మి॥ స్నుషాం... గోత్రాం ... దా యీాం వసురూపాంస్వ...మి॥ శ్వశురం...గోత్రం...శర్మాణం ... స్వ... మి॥ స్యాలకం...గోత్రం...శర్మాణం...స్వ...మి॥ శ్వశ్రూం... గోత్రాం ...పదాయీాం వసురూపాంస్వ...మి॥ గురుం...గోత్రం... శర్మాణం... మి॥ రిక్థినం...గోత్రం...శర్మాణం...మి॥ స్వామినంతర్పయామి॥ సఖింతర్ప యామి॥ గురుంతర్పయామి॥ ఆచార్యంతర్పయామి॥ స్వామిసఖగురుఆచా

ర్యాది సర్వేషాం కారుణ్యానాం తర్పయామి॥

(తర్పణముజరుపునప్పుడు మఱియొకవిషయము గ్రహించదగునుట్లనిన.)

అన్నలకు జ్యేష్ఠభ్రాతరమనియును, తమ్ములకు కనిష్ఠభ్రాతరమని యును, పెద్దభార్యకు జ్యేష్ఠభార్యామనియును, చిన్నభార్యకు తదనంతర భార్యామనియును. ఇట్లూహించవలెననుట.

శ్లో॥ ఏకేచాఽస్మత్కులేజాతా అపుత్రాగోత్రిణోమృతాః।

తేగృహ్ణంతుమయాదత్తం సూత్రనిష్పీడనోదకమ్॥ శ్రీరామ॥

శ్రాద్ధాదుల కవయవ భూతంబగు తిలతర్పణవిధిఁ జెప్పఁబడుచు న్నది. పితృతర్పణము నిత్యమని, నైమిత్తికమని రెండువిధములు. మా తృపితృవర్గముల వారినుద్దేశించి వసురుద్రాదిత్య శబ్దముల నుచ్చరింపక జ లమాత్రముచేత జేయఁబడు తర్పణమునిత్యమనఁబడును. ఆబ్దికాది నైమి త్తికాదులయందు చేయఁబడు తిలతర్పణమందు వసురుద్రాదిదిత్యరూపము లుచ్చరించిచేయఁబడుతర్పణము నైమిత్తికమనఁబడును.

శ్లో॥ పార్వణేనయుతే శ్రాద్ధే రూపముద్దిశ్య తర్పయేత్!
అన్యథా తర్పయేద్విద్వాన్ నామగోత్రాదిసంయుతమ్॥

తా॥ పార్వణశ్రాద్ధమును చేయునపుడు వసురుద్రాదిత్య శబ్దములతో గూడ జేయుతర్పణము నైమిత్తికమనియు, పార్వణశ్రాద్ధములేక ప్రతిదినముం జేయుతర్పణము నిత్యతర్పణమనియు తాత్పర్యము.

యాజ్ఞవల్క్యః॥ శ్లో॥ సవర్ణేభ్యోజలం దేయం నాసవర్ణేభ్యఏవచ।
నామగోత్రస్వధాకారైః ప్రత్యహం తర్పయేత్సుధీః॥

తా॥ సవర్ణులకొఱకే ఉదకదానము జేయవలయును. అసవర్ణులకొఱకు చేయఁబనిలేదు ఈయుదకదానము జేయునపుడు నామమును, గోత్రమును, స్వధాయనుశబ్దమును, నుచ్చరించుచు ప్రత్యహము తర్పణము జేయవలయునని యాజ్ఞవల్క్యుని యభిప్రాయము.

శ్రాద్ధదర్పణే॥ శ్లో॥ తర్పయే త్రీన్పితౄన్నాదౌ తతశ్చైవతుమాతరమ్।
సాపత్నీమాతరం పశ్చాత్పితామహ్యాదికాః క్రమాత్!

తా॥ ముందుగా పితృపితామహ ప్రపితామహులకును పిదపమాతృపితామహీ ప్రపితామహీలకును తర్పణము జేయవలయునని శ్రాద్ధదర్పణమనుగ్రంథమునందు జెప్పఁబడియె- ఈ

# తర్పణనిర్ణయము.

శ్లోకమునందు ,తామహ్యాదికాః క్రమాత్॥ అని ఆదిశబ్దము జెప్పఁబడియుం  వలన మా
తామహాదులకును జేయవలయునని యెఱుంగునది॥

శ్లో॥ ఆద్యాపితాతథామాతా సాపత్నీజననీతథా ।
మాతామహాస్సపత్నీకా ఆత్మపత్న్యనంతరమ్॥
సుతభ్రాతృపితృవ్యాశ్చ మాతులాస్సహభార్యకా
దుహితాభగినీచైవదౌహిత్రోభాగినేయకః॥
పితృష్వసామాతృష్వసా స్యాలకోభావుకస్నుషా
శ్వశురాచార్యగురవస్స్వామిసఖ్యాదయస్తథా॥
ఇత్యేతేపితరస్తీర్థై స్తర్పణీయాయథావిధి॥

అన్యత్రాపి॥ శ్లో॥ పితృష్వసామాతృష్వసా జామాతాభావుకస్నుషా ।
శ్వశురశ్శ్యాలకశ్చైవ శ్వశ్రూశ్చగురురర్థినః॥

తా॥ ః తల్లిదండ్రులు, పిదపసవతితల్లి, మాతామహామాతుః పితామహామాతుః ప్ర
పితామహా మాతామహీమాతుః పితామహీమాతుః ప్రపితామహీలు, తనభార్య, కుమా

ద్వాద్వాసాపత్ని మాతుస్తుత్రీంస్త్రీ న్మాతృగణస్యచ॥ పిత్రా
ణాంచైవదేవానాం జలేదద్యాజ్జ లాంజలీన్ । అసంస్కృత ప్ర
మీతానాంస్థలేదద్యాజ్జలాంజలీన్॥ భూమాయస్తర్పణంకుర్యా
ద్రాహ్యేకాంస్యేచమృణ్మయే। తర్జన్యాంగుష్ఠయోగేచసపుత్రఃపి
తృఘాతకః॥ స్థలేవాపిశుచౌదేశే కుశాస్తీర్ణేచభాజనే। తా
మ్రాదిపాత్రేపర్ణేవాతర్పయేత్సతిలైశ్శుభైః॥ వసిత్వావసనంశు
ష్కంస్థలేవిస్తీర్ణబర్హిషి। విధిజ్ఞస్తర్పణంకుర్యాత్నర్వాన్పితృగ
ణాంస్తథా॥ పాణినైకగుణంప్రోక్తం దర్భైశ్శతగుణంతతః। అ
శుయ్యంఖడ్గపాత్రేణ పిత్రాణాంతర్పణంభవేత్॥ తృప్యతేయేన
తీర్థేనగృహ్ణీయాత్తేనవైజలమ్॥ అన్యథాకురుతేయస్తు నరకంప్ర
తిపద్యతే॥

తా॥ మాతృపితామహీప్రపితామహీలకుమూడు దోసిళ్లను, యితరులగుస్త్రీలకురెం
డేసిదోసిళ్ళులను, ఉదకదానముసేయవలయు- పితృదేవతలకును, దేవతలకును, జలమూల

# తర్పణనిర్ణయము.

యందుదక దానము సేయవలయు- ఉపనయనాదిసంస్కారవిహీనముగ మృతినొందినవారికి స్థలమునందుదక దానము సేయవలయు-భూమియందైనను, వెండిపాత్రయందైనను, కంచుమట్టి పాత్రలయందైనను, తర్జన్యంగుష్ఠములంగలిపియైనను తర్పణము సేయువాడుపితృఘాతకుండ నబడునుకావునస్థలమునందైనను, పరిశుద్ధమగు దేశమునందైనను, దర్భలుంచబడినపాత్రి యందైనను, రాగిపాత్రయందైనను ఆకుయందైనను, పరిశుద్ధమగువస్త్రమును గట్టుకొనిదర్భ పఱుపబడినభూమియందుగూర్చుండి పరిశుద్ధమగు నుదకములచేదర్పణంబు సేయవలయు- ఒట్టిచేతితో జేసినతర్పణం బొక్కగుణముగలదియనియు, దర్భపవిత్రంబునుధరియించినచేతితో జేసినతర్పణము నూఱుగుణములుగలదియనియు, ఖడ్గపాత్రముచే జేసినతర్పణము అక్షయముగుననియు నెఱుంగవలయు- శాస్త్రవిధిప్రకారముతర్పణంబొనర్చినపితృదేవతలుతృప్తినొందుదురు- శాస్త్రవ్యతిరిక్తముగదర్పణము సేయువాడునరకమునుబొందును॥

పితృకార్యమునందు యెంతమందియుద్దేశింపబడుదురో యందరికిమాత్రమేవసురుద్రాదిత్యనామములనుచ్చరించి తర్పణము సేయవలయు॥

దర్పణే॥ శ్లో॥ దర్భైస్తిలోదకంపూర్వం పశ్చాచ్ఛ్రాద్ధాన్నమాలయే।
ఆబ్దికేనపరంపూర్వం పరేహానితిలోదకమ్॥ ప్రత్యబ్దంతుపరేహని॥

తా॥ అనుదర్పణకారునివచనప్రకారము దర్శశ్రాద్ధమునందు బ్రాహ్మణభోజనమునకు పూర్వమునందును, ప్రాతిసాంవత్సరిక శ్రాద్ధమునందు పరదినమునందును తర్పణము సేయవలయును.

మఱియు ప్రాతిసాంవత్సరిక శ్రాద్ధమునందును నందరికిని తర్పణము సేయవలసివచ్చునని కొన్ని వచనములుగలవు- ఆవచనములు కాలవిశేషములను సూచించిబోధించినవి కానిపేరొండుకాదు॥

శ్లో॥ దర్శేపాతేచసంక్రాంతౌ యుగమన్వంతరాదిషు ।
తర్పయిత్వాపితౄన్పశ్చా చ్ఛ్రాద్ధంకుర్యాత్ప్రయత్నతః॥

తా॥ దర్శశ్రాద్ధమునందును, సంక్రమణాదులయందును, యుగాదులయందును, మన్వంతరములయందును, ముందుతర్పణముచేసి పిదపశ్రాద్ధము నాచరింపవలయును॥

శ్లో॥ పక్షశ్రాద్ధేహిరణ్యేచ పశ్చాద్దద్యాత్తిలోదకమ్ ।
తథాచైవాష్టకశ్రాద్ధే శ్రాద్ధేచైవానుమాసికే॥

తా॥ పక్షశ్రాద్ధమునందును, హిరణ్యశ్రాద్ధమునందును, అష్టకశ్రాద్ధమునందును, అనుమాసికశ్రాద్ధమునందును, శ్రాద్ధానంతరకాలమునందు తిలతర్పణముగావింపవలయును॥

శ్లో॥ సపిండీకరణే శ్రాద్ధే ప్రేతశ్రాద్ధానుమాసికే।
సంవత్సరవిమోకే చ న కుర్యాత్తిలతర్పణమ్॥

తా॥ అనునీవచనమునందు సపిండీకరణశ్రాద్ధమునందును ప్రేతశ్రాద్ధాను మాసికమునందును, సంవత్సరవిమోకమునందును తిలతర్పణము సేయగూడదు అనియుండగా తిలతర్పణా మెటులజేయవచ్చునని యనగూడదు యీవచనమునందు తిలతర్పణము సేయగూడదనగా పరదినమునందు సేయగూడదనియభిప్రాయము॥

శ్లో॥ వృద్ధిశ్రాద్ధే సపిండే చ ప్రేతశ్రాద్ధానుమాసికే।
పరేహాని విమోకే చ న కుర్యాత్తిలతర్పణమ్॥

తా॥ వృద్ధిశ్రాద్ధమునందును, సపిండీకరణ శ్రాద్ధమునందును, ప్రేతశ్రాద్ధానుమాసికమునందును, సంవత్సరవిమోకమునందును, పరదినమునందు తిలతర్పణము సేయగూడదు-

శ్లో॥ కృత్వానుమాసికంశ్రాద్ధం సపిండీకరణాత్పరమ్।
వైశ్వదేవంతతః కుర్యాత్తర్పణంతిలసంయుతమ్॥

తా॥ అనుమాసికశ్రాద్ధసపిండీకరణ శ్రాద్ధములయందనంతరమునందు తిలతర్పణము వైశ్వదేవము సేయవలయును-

శ్లో॥ తీర్థశ్రాద్ధేగయాశ్రాద్ధేశ్రాద్ధేప్రత్యాబ్దికేపిచ।
పరేహనిద్విజఃకుర్యా త్తర్పణంతిలసంయుతమ్॥
పక్షశ్రాద్ధంతునిర్వర్త్య తర్పణంతదనంతరమ్।
సకృన్మహాలయేశ్రాద్ధే పరేహనితిలోదకమ్॥

తా॥ తీర్థశ్రాద్ధమునందును, గయాశ్రాద్ధమునందును, ప్రాతిసాంవత్సరికశ్రాద్ధమునందును, పరదినమునందుతర్పణముసేయవలయును - పక్షశ్రాద్ధమునందు తచ్ఛ్రాద్ధంబొనర్చినపిమ్మట తర్పణముసేయవలయును- మహాలయశ్రాద్ధమునందును పరదినమునందుతిలతర్పణముసేయవలయును- ప్రాతిసాంవత్సరికశ్రాద్ధమునందు శ్రాద్ధాంగమగుతిలతర్పణమును పరదినప్రాతఃకాలమునందేచేయవలయును- ఈప్రకారముఆయాకాలములయందు జేయవలసిన తర్పణము- ఆయాశ్రాద్ధములకంగభూతమైయున్నది- కావుననీతర్పణమునిత్యతర్పణముకంటెభిన్నమనియెఱుగవలయును- ఇట్లు రెండువిధములగు తర్పణములను ప్రత్యాబ్దికశ్రాద్ధము మొదలగు శ్రాద్ధములయందు భిన్నముగ జేయవలయు.

ప్రత్యాబ్దికశ్రాద్ధమునందునిత్యతర్పణము శ్రాద్ధానంతరకాలమునందు జేయవలయును.

హారీత॥ శ్లో॥ పిత్రోః ప్రత్యాబ్దికే ప్రాప్తే తర్పణంతు కథం భవేత్।
జలేనైవ ప్రకుర్వీత నివృత్తే పితృకర్మణి॥

తా॥ అనునీహారీతస్మృతివచనమునందును, తల్లిదండ్రులయాబ్దికమునందు శ్రాద్ధానంతరమందే నిత్యతర్పణము సేయవలయునని విధింపఁబడియున్నది. పినతండ్రి మొదలగువారల ప్రత్యాబ్దికశ్రాద్ధములయందు నిత్యతర్పణమును శ్రాద్ధకర్మమునకు ముందుగనే చేయవలయు. ఎందుకనిన నిత్యతర్పణము పితృపూర్వకంబైన దగుటచే ననియెఱుంగవలయును.

శ్లో॥ నిత్యకర్మాబ్దికశ్రాద్ధే కారుణ్యానాం కథం భవేత్।
ఆబ్దికాత్తర్పణం పూర్వం కుర్యాచ్ఛ్రాద్ధమనంతరమ్॥

తా॥ అనునీస్మృతివచనమువలనను కారుణ్యశ్రాద్ధములయందు నిత్యతర్పణాదులను ఆబ్దికకృత్యములకంటె పూర్వమునందే చేయవలయునని స్పష్టమగుచున్నది.

శ్లో॥ పితృవర్గం మాతృవర్గం వర్గం మాతామహస్య చ।
తర్పయిత్వాథ కారుణ్యా నర్పయేదితి శౌనకః॥

తా॥ అనునీశౌనకవాక్యమునందును - ముందు పితృపితామహప్రపితామహులను పిమ్మట మాతృపితామహీప్రపితామహీలను అనంతరము మాతామహమాతుః పితామహమాతుః ప్రపి

తామహాంలను పిదపమాతామహీమాతుః పితామహీమాతుః ప్రపితామహీలను, గూర్చితర్పణముసేసి యటుపిమ్మట కారుణ్యతర్పణము సేయవలయునని విధింపఁబడియున్నది. కావున కారుణ్యశ్రాద్ధములయందు పిత్రాదివర్గములకు నిత్యతర్పణముసేసి పిమ్మట కారుణ్యశ్రాద్ధకృత్యములనాచరింపవలయు. సకలదర్శాదిశ్రాద్ధములయందును నిత్యతర్పణము శ్రాద్ధానంతరమునందే చేయవలయును.

పైఠీనసిః॥ శ్లో॥ శ్రాద్ధంకృత్వాతు విధివద్వైశ్వదేవమతఃపరమ్ ।
బ్రహ్మయజ్ఞంతతఃకుర్యా త్తర్పణాంతుతిలైర్వినా॥

తా॥ యథావిధిగశ్రాద్ధము చేసినపిమ్మట వైశ్వదేవమును బ్రహ్మయజ్ఞమును, తిలవిహీనముగ దర్పణమును సేయవలయును. శ్రాద్ధావయవమగు తిలతర్పణమును శ్రాద్ధదివసముల యందు విధింపఁబడిన కాలవిశేషములయందే ఆచరింపవలయు - మాతాపితృశ్రాద్ధములయందవయవభూతమగు తిలతర్పణమును పరదినప్రాతఃకాలమునందే చేయవలయునని యిదివరకే చెప్పఁబడియుండినను మఱల వివరించెదము.

శ్లో॥ తతఃపరేహ్ని కుర్వీత తర్పణంపురుషస్సుధీః ।
తచ్ఛేషైస్తిలదర్భైస్తు ప్రాతస్స్నాత్వామృతైర్జలైః॥

తా॥ టనీహారీతస్మృతియందును శ్రాద్ధానంతర మొనర్పవలసిన తర్పణమును శ్రాద్ధ దినమునందు మిగిలినతిలదర్భలను భద్రముగనెత్తిపెట్టి పరదినమునందుదయమునస్నానంబొనర్చి ఆతిలదర్భలతోటితర్పణముసేయవలయును. ఇట్లుప్రాతఃకాలమునందుచేసిన తర్పణోదకము అమృతమగును.

శ్లో॥ తర్పణాత్వమృతంప్రాతః ద్వితీయేప్రహరేపయః ।
తృతీయేజలమిత్యాహు శ్చతుర్థేరుధిరంభవేత్ ॥
తస్మాచ్ఛ్రాద్ధంతుపూర్వేద్యుః కృత్వాస్నాత్వాపరేహని ।
ప్రాతఃపితౄంశ్చసంతర్ప్య పశ్చాత్సంధ్యాదికాంచరేత్ ॥

తా॥ అనుసీస్మృత్యంతరవాక్యములయందు పితౄదికార్యదినములయందు చేయవలసినతర్పణముమరుదినప్రాతఃకాలమునందు జేసినేని ఆతర్పణోదకముఅమృతమగును రెండవయామమునచేసినేని క్షీరంబగును- మూడవయామంబునచేసినేని సామాన్యజలంబగును. చతుర్థయామంబునచేసినేని రక్తతుల్యంబగును. కావునశ్రాద్ధమునుపూర్వదినమునందు చేసిపరదినమునందు ప్రాతఃకాలమునందే స్నానముచేసితర్పణంబొనర్చి సంధ్యావందనాదికృత్యంబులంజేయవలయు.

శ్లో॥ తిలదర్భయుతంతోయం స్వధయాయత్రదీయతే।
తత్తోయమక్షయంభూత్వా పితౄణాంతృప్తిదంభవేత్॥

తా॥ తిలదర్భలతోగూడినయుదకమును స్వధాకారంబుతో నిచ్చితేనిఆయుదకముఅక్షయంబగుటయేగాక పితృదేవతలుతృప్తులగుదురు.

ప్రయోగపారిజాతే॥ శ్లో॥ పరేహన్యుషసిస్నాత్వా కృత్వాశ్రాద్ధాంగతర్పణమ్। పునస్స్నాత్వైవకుర్వీత ప్రాతస్సంధ్యాంసమాహితః॥
ఉదితేతురవౌస్నాత్వా సంధ్యాంకృత్వైవతర్పయేత్॥

తా॥ పరదినప్రాతఃకాలమందు స్నానముజేసి శ్రాద్ధాంగతర్పణముజేసి మఱలస్నానముజేసి సంధ్యావందనాదికృత్యంబులనొనర్పవలయును - సూర్యోదయంబయ్యేనేని స్నానానంతరమునందుసంధ్యావందనంబొనర్చి శ్రాద్ధాంగతర్పణంబొనర్పవలయును॥

శ్లో॥ యస్తుతర్పయతేప్రాతః కృత్వాశ్రాద్ధంపరేహని। పితరస్తృప్తిమాయాంతి నచేత్కుప్యంతివైధ్రువమ్॥ పరేద్యుశ్శ్రాద్ధకృత్స్నాత్వా యోనతర్పయతేపితౄన్। అతృప్తాఃపితరస్తస్య శాపందత్త్వావ్రజంతితే॥

తా॥ పురుషుఁడు పూర్వదినమునందు శ్రాద్ధంబొనర్చి మరుదిన ప్రాతఃకాలమున స్నానము చేసి తర్పణము చేసినచో పితృదేవతలు తృప్తులగుదురు. అట్లు గావింపకేని పితృదేవతలు కోపించుదురు. మఱియు మరుదిన ప్రాతఃకాలమునందు తర్పణంబు చేయనివానికి పితృదేవతలు శాపంబొసంగుదురు. కావున తీర్థశ్రాద్ధమునందును గయాశ్రాద్ధమునందును తిలతర్పణమును పరదినమునందే చేయవలయును॥

మనుస్మృతౌ॥ శ్లో॥ తీర్థశ్రాద్ధే గయాశ్రాద్ధే శ్రాద్ధే ప్రత్యాబ్దికేపి చ ।
పరేహని ద్విజః కుర్యాత్తర్పణం తిలసంయుతమ్॥

తా॥ తీర్థశ్రాద్ధ గయాశ్రాద్ధ ప్రత్యాబ్దిక శ్రాద్ధములయందు పరదినంబున శ్రాద్ధాంగతర్పణం బాచరింపవలయునని మనువు వచియించె. మఱియు నొకానొకప్పుడు మహాలయమునందును పరదినమునందే తర్పణంబొనర్పవలయు॥

దక్షః॥ శ్లో॥ శ్రాద్ధాంతే ప్రత్యహం కుర్యాత్ పితృశ్రాద్ధాంగతర్పణమ్।
సకృన్మహాలయే శ్రాద్ధే పరేహని తిలోదకమ్॥

తా॥ పితృశ్రాద్ధమునందు శ్రాద్ధానంతర కాలమునందును ఒకానొక మహాలయశ్రాద్ధమునందు పరదినంబున తిలోదకదానము చేయవలయునని దక్షునిమతము. దర్శపాతసంక్రా

మణయుగ మన్వంతరాది కాలీనశ్రాద్ధములయందు శ్రాద్ధకృత్యమునకు పూర్వమునందు తిలతర్పణము జేయఁదగినది॥

మత్స్యపురాణే॥ శ్లో॥ పితృయజ్ఞంతు నిర్వర్త్య తర్పణాఖ్యం ద్విజోత్తమః।
పిండాన్వాహార్యకం శ్రాద్ధం కుర్యాదిందుక్షయే పిచ॥

తా॥ తర్పణంబను పేరుగల పితృయజ్ఞంబొనర్చి పిండాన్వాహార్యక శ్రాద్ధంబు నాచరింపవలయు. పిండాన్వాహార్యక శ్రాద్ధంబనఁగా దర్శాది శ్రాద్ధంబని యెఱుంగునది॥

శ్లో॥ దర్శే స్నాత్వా పిదం భస్తు దద్యాత్ప్రత్యక్షతిలోదకమ్। అన్నంచ విధివద్దద్యాత్ పరతస్తన్నవర్తతే॥ దర్శే పాతేచ సంక్రాంతౌ యుగమన్వంతరాదిషు। తర్పయిత్వా పితౄన్పశ్చాచ్ఛ్రాద్ధం కుర్యాత్ప్రయత్నతః॥

తా॥ దర్శశ్రాద్ధమునందు తిలోదకదానంబును యథావిధిచే నన్నదానంబును నొనర్పవలయును దర్శపాతసంక్రమణయుగ మన్వంతరాదులయందు ముందు తర్పణంబొనర్చి పిదప శ్రాద్ధకృత్యంబుల నాచరింపవలయు॥

శ్లో॥ పక్షశ్రాద్ధే హిరణ్యేచ పశ్చాద్దద్యాత్తిలోదకమ్।
తథా చైవాష్టకశ్రాద్ధే శ్రాద్ధే చైవానుమాసికే॥

తా॥ పత్న్యశ్రాద్ధహిరణ్యశ్రాద్ధ అష్టక న్వ అనుమాసికశ్రాద్ధములయందుతిలతర్పణము
శ్రాద్ధానంతరమందుజేయవలయును పత్న్యశ్రా లయందుఅంగతిలతర్పణము జేసినపిదపనిత్య
తర్పణంబొనర్పవలయును- ఈయర్థంబుగల సివచనము పూర్వమే చెప్పఁబడినది. పితృ
వ్యాదికారుణ్యశ్రాద్ధములయందు అవయ తంబగు తిలతర్పణము శ్రాద్ధానంతరమందుచే
యవలయును గాని పరదినమునందు చేయు ని యొప్పుచున్నది॥

శ్లో॥ శ్రాద్ధాంగతర్పణం కు ర్వతిలంత్వపరేహని ।
పిత్రోర్విషయవస్యా న్యావిషయేభవేత్ ॥

తా॥ తలిదండ్రుల శ్రాద్ధములయంద లతర్పణంబు పరదినంబున జేయవలయును- కారు
ణ్యశ్రాద్ధములయందా దినంబునందు శ్రా నంతరమందే చేయవలయును॥

మను॥ శ్లో॥ నైకశ్రాద్ధద్వయం ర్యాత్సమానేహనికుత్రచిత్ ।
నయజ్ఞంనబలించైవ ఋషితర్పణమ్॥

తా॥ ఒకదినంబునందే రెండుశ్రాద్ధ ను జేయఁగూడదు- మఱియు శ్రాద్ధదినంబునం
దు బ్రహ్మయజ్ఞవైశ్వదేవదేవఋషి ంబులనుగూడ జేయఁగూడదని మనువు

చె- ఇట్లుండనిత్యతర్పణం బొనర్పవలదనెడి వచనం బెట్లొప్పుకొనవచ్చుననిన నిషేధ
ము శ్రాద్ధకాలీనవిషయంబని తెలియఁగునది॥

శ్లో॥ శ్రాద్ధంనిర్వర్త్యవిధివద్వైశ్వదేవమతఃపరమ్।
బ్రహ్మయజ్ఞంతతః కుర్యాత్తర్పణాంతుతిలైర్వినా॥

తా॥ అనునీపైఠీనసివాక్యము పూర్వమునందే వివరించియున్నాఁడను॥

శ్లో॥ పితుఃక్షయాహేసంప్రాప్తే సర్వేషాంతర్పణంనహి।
మాతుఃక్షయాహేసంప్రాప్తే తద్వర్గేతర్పణంనహి॥

తా॥ తండ్రియొక్క ప్రత్యాబ్దికశ్రాద్ధమునందె వరికినితర్పణంబులేదు- తల్లియొక్క ప్రత్యాబ్దికంబునందును ఆవర్గంబువారికె వరికిని తర్పణంబు లేదనియెఱుంగనగు- పితృమాతృతర్పణనిషేదం బెట్లనిన— ఈవచనము తండ్రిబ్రతికియుండగా తల్లిమృతినొందినవాడు శ్రాద్ధాంగతర్పణము జేయఁగూడదను యభిప్రాయంబుగలది- కావున విరోధంబేమియు లేదని యెఱుఁగవలయుఁగాని నిత్యతర్పణనిషేధపరంబని యెఱుంగదగినది కాదు- ఈవచనార్థమువివరించెద- పితృశ్రాద్ధమునందు శ్రాద్ధాంగతర్పణము పితృపితామహప్రపితామహులకే చేయవలయు తదితరులకు జేయఁగూడదు- మాత్రాదిశ్రాద్ధములయందును యెందరుద్దిష్టులగుదురో

# తర్పణనిర్ణయము.

అందరికి ప్రాతఃకాలమునందు తిలతర్పణంబాచరింపవలయు- మఱియు తండ్రి బ్రతికియుండగా
తల్లిమృతినొందినవాడు మాతృశ్రాద్ధకాలమునందు పరదినంబున తిలతర్పణంబు జేయఁగూడదు

శ్లో॥ జీవమానఃపితాయస్య మాతాయదివిపద్యతే।
మాతుశ్శ్రాద్ధంసుతః కుర్యాన్నకుర్యాత్తిలతర్పణమ్॥

తా॥ జీవపితృండై మాతృశ్రాద్ధమునాచరించు సమయంబునందు అవయవభూతంబగు తి
లతర్పణము జేయఁగూడదు- ఐనను నిత్యతర్పణము శ్రాద్ధముతోడంజేరినది కాదు- గనుక దానిని
మాత్రము ఆచరింపవలయు॥

స్మృత్యంతరే॥ శ్లో॥ నజీవపితృకఃకుర్యాచ్ఛ్రాద్ధాంగతిలతర్పణమ్।
శ్రాద్ధమాత్రంప్రకుర్వీత తర్పణంతుపితాచరేత్॥

తా॥ జీవపితృవులుగలవారు శ్రాద్ధంబును మాత్రం బొనర్పవలయు గాని శ్రాద్ధాంగతిలతర్ప
ణంబు జేయఁగూడదు ఆతర్పణంబును తండ్రి చేయవలయునని స్మృతికారులు వచియించిరి- ఇఁ
క శ్రాద్ధద్వయము ఒక దినంబున సంభవించెనేని వాటి విధిని వివరించెద;— మన్వాదిశ్రాద్ధంబు
లచే దర్శాదిశ్రాద్ధంబులు సిద్ధించుచునట్లు శ్రాద్ధాంగతర్పణంబుచే నిత్యతర్పణంబు సిద్ధింప
దు- దర్శమన్వాదిశ్రాద్ధంబు లొకసారిగ సంభవించెనేని రెండు శ్రాద్ధంబులు భిన్నంబు

రైన నారెంటియందు నుపాసించదగినదేవతలు భిన్నులుగావు కావునవారెండును నొక్క-
ర్మచేతనే సిద్ధించుమన్నదని తాత్పర్యము;—ప్రత్యాబ్దికశ్రాద్ధంబులయం దుపాసించఁద
న శ్రాద్ధదేవతలు భిన్నులుగావనట్లు సిద్ధించకపోవుట నిశ్చయంబు- ప్రత్యాబ్దికములయం
మపితృపితామహ ప్రపితామహులే సేవించఁదగినవారుగాన శ్రాద్ధాంగతిలతర్పణంబునందు
ను ముగ్గురికే దేవత్వము గానియితరులకు లేదని దెలుసుకొనవలయును॥

శ్లో॥ ప్రత్యబ్దాంగతిలాంబుస్యాన్నిషిద్ధేపిపరేహని।
శ్రాద్ధేయావంతఉద్దిష్టాః ప్రాతస్తానేవతర్పయేత్॥

తా॥ ప్రాతిసాంవత్సరిక శ్రాద్ధంబులయందు తిలతర్పణంబును పరదినప్రాతఃకాలమునం
దే శేయువలయును అటులైతే దేవతలు వేఱు గాన ప్రత్యాబ్దిక శ్రాద్ధంబులయందు నిత్యశ్రా
ద్ధంబులొనర్చినట్లు నిత్యతర్పణంబును శేయవలయును॥

శ్లో॥ పితరోయత్రపూజ్యంతే తత్రమాతామహాఅపి।
అవిశేషేణకర్తవ్యం విశేషాన్నరకంవ్రజేత్॥

తా॥ పితృదేవతలు యేసమయంబునఁ బూజింపఁబడుదురో యెట్టిసమయములయందు
మాతామహాదులును ౨ సమానముగఁ బూజింపఁదగినవారని దోఁచుచున్నది- ఇట్లుసమానం

బుగఁబూజింపనిపక్షమున నరకంబును బొందుదురు వర్గద్వయంబునకును దేవత్వముగలదని చెప్పుటచేతయేవర్గవారికిశ్రాద్ధమును బెట్టెదరో వారికే శ్రాద్ధాంగతర్పణంబును జేయవలయు నని దెలియవలయును- ఈప్రకారము దర్శశ్రాద్ధములయందును మహాలయశ్రాద్ధమునయందు ను జేయవలయునని తా॥

శ్లో॥ వర్గద్వయాసముద్దిశ్య శ్రాద్ధంచాపరపక్షకమ్॥

తా॥ అనువచనముచేత అపరపక్షశ్రాద్ధము రెండు వర్గంబులవారికి జేయవలయునని దోచుచున్నది ఆఅపరపక్ష శ్రాద్ధాంగతర్పణంబు రెండువర్గంబులవారికిని జేయవలయును అందువలన శ్రాద్ధంబులయందును అర్ఘ్యంబులయందును రెండువిధములయిన తర్పణంబులను జేయవలయును-పితృతర్పణము రెండువిధములని చెప్పుటయే పరికావుఅదెట్లనిన బ్రహ్మయజ్ఞాంగమగు దేవర్షి పితృతర్పణమునకు భిన్నంబయిననిత్యపితృతర్పణము నిత్యశ్రాద్ధాంగ తర్పణంబుగను కదని తెలిసికొనవలయును మఱియును నిత్యమగుపితృతర్పణము నిత్యముగా జేయు శ్రాద్ధంబునకవయవంబు గాదనియును తాత్పర్యము-కాఁబట్టియివిరెండును వేఱువేఱుగాగాని యొక్కటి గాదనియు వ్యాఖ్యాభిప్రాయము॥

శ్లో॥ యన్నిత్యతర్పణంకుర్యాద్రూపహీనందినేదినే।
శ్రాద్ధాంగతర్పణంకుర్యాద్రూపయుక్తంతిలాంబుభిః॥

తా॥ నిత్యతర్పణమునందు వసురుద్రాదిత్యశబ్దంబులనుచ్చరింపఁగూడదు- నిత్యశ్రాద్ధమునందు వసురుద్రాదిత్య శబ్దముల నుచ్చరింపవలయును- కావుననిత్యతర్పణమునకు నిత్యశ్రాద్ధమునకును భేదముకలదు- నిత్యశ్రాద్ధమునందార్గురు దేవతలకు తర్పణంబును జేయవలయును- నిత్యతర్పణమునందు పితృవ్యాదికారుణ్య దేవతలనుఁగూడతర్పణంబును జేయవలయును- కాఁబట్టినిత్యతర్పణమునకును నిత్యశ్రాద్ధమునకును మిగుల, భేదముగలదనిగ్రహింపవలయును॥

శ్లో॥ కుర్యాదహరహశ్శ్రాద్ధమన్నాద్యేనోదకేనవా॥

తా॥ అనువచనంబుచేతనుఁగూడనిత్యతర్పణమునకును నిత్యశ్రాద్ధమునకును భేదముకలదని తా॥

శ్లో॥ అధ్యాపనంబ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తుతర్పణమ్।
హోమోదైవోబలిర్భౌతోనృయజ్ఞోతిథిపూజనమ్॥

తా॥ అనువచనంబుచేత వేదమును చదువుట బ్రహ్మయజ్ఞమనియును పితృయజ్ఞము తర్పణమనియును వైశ్వదేవము వైవబలియనియును మనుష్యయజ్ఞమతిథి పూజనంబనియును తాత్పర్యము.

శ్రుతిః॥ యత్పితృభ్యస్స్వధాకరోత్యప్యపస్తత్పితృయజ్ఞస్సంతిష్ఠతే॥

తా॥ అని వేదమునందును నిత్యతర్పణము స్వతంత్రమైనకర్మయని చెప్పఁబడుటచేత నిత్యతర్పణము నిత్యశ్రాద్ధముకంటె వేరైనదని తాత్పర్యము. ప్రతిసాంవత్సరిక శ్రాద్ధంబులయందు దర్శాదిశ్రాద్ధంబులు వచ్చినట్లైతే రెంటినిగూడ నాచరింపవలయును తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందు నిత్యపితృతర్పణమును శ్రాద్ధానంతరమందు జేయవలయును శ్రాద్ధాంగతిలతర్పణమును పరదినప్రాతఃకాలమునందు వర్గత్రయము వారికిమాత్రము సేయవలయును తండ్రిబ్రతికియుండినపుడు తల్లియొక్క శ్రాద్ధమును జేయువాఁడు శ్రాద్ధదినమునందుగాని పరదినమందుగాని శ్రాద్ధాంగతర్పణమును జేయఁగూడదు నిత్యతర్పణం బెప్పుడును లేదు జ్యేష్ఠభ్రాతృవులు మొదలగువారియొక్క కారుణ్యశ్రాద్ధములయందు నిత్యతర్పణమును శ్రాద్ధమునకు ముందుగఁజేయవలయును పిదప శ్రాద్ధమును నాచరింపవలయును శ్రాద్ధాంగతర్పణమును శ్రాద్ధానంతరమునందే చేయవలయునుగాని తల్లి

దండ్రులశ్రాద్ధంబులకువలెఁ బరదినంబునఁ జేయనక్కఱలేదు దర్శపాతయుగమన్వంతరము మొదలగు శ్రాద్ధములయందు తిలతర్పణమును ముందుగనాచరించిపిమ్మట శ్రాద్ధమును జేయవలయును- నిత్యతర్పణమును మాత్రము శ్రాద్ధమైనపిమ్మటఁ జేయవలయును- పక్షశ్రాద్ధ కారుణ్యశ్రాద్ధఅష్టకశ్రాద్ధఅనుమాసిక శ్రాద్ధములయందు శ్రాద్ధాంగతర్పణమును శ్రాద్ధదినమునందె జేయవలయును గానిపరదినమునందుఁ జేయఁగూడదు- ఒకానొకప్పుడు మహాలయమునందుమాత్రము శ్రాద్ధాంగతర్పణమును పరదినమునందును నిత్యతర్పణమును శ్రాద్ధమును బెట్టినపిదపను జేయవలయును- మహాలయశ్రాద్ధము రెండువిధములు- ఆరెంటిలోఁ బక్షశ్రాద్ధము ముఖ్యము-సకృన్మహాలయ గౌణమనియును జెప్పబడును-ఈరెంటిలో ముఖ్యమైనమహాలయశ్రాద్ధమునందు తిలతర్పణమును శ్రాద్ధమును బెట్టినపిదపఁ జేయవలసినది- సకృన్మహాలయ శ్రాద్ధమునందు పరదినమునందు తిలతర్పణంబును జేయవలయును- పక్షశ్రాద్ధ దర్శాదిశ్రాద్ధములయందు అంగతిలతర్పణమును పరదినమునందె జేయవలయును- అందువలననిట్టిశ్రాద్ధంబులయందు తాంబూలచర్వణము సేసినను దోషములేదని జెప్పఁబడినది- కారణమేమనిన శ్రాద్ధాంగకార్యములన్నియు సమాప్తమగుటవల్లనని దెలియవలెను॥

ప్రయోగపారిజాతే॥ శ్లో॥ పక్షశ్రాద్ధేతథాదర్శే యుగమన్వంతరాదిషు।
శ్రాద్ధంనిర్వర్త్యభుక్త్వాతు తాంబూలంఖాదయేద్ద్విజః॥
మోహాదకృత్వాయశ్శ్రాద్ధం తాంబూలంయదిఖాదయేత్।
శ్రాద్ధంహంతాభవేత్కర్తా రౌరవంనరకంవ్రజేత్॥

తా॥ పక్షదర్శయుగ మన్వంతరాదులయందు శ్రాద్ధకర్మ నాచరించిపిదప దాంబూలచర్వణాదికమును జేయవచ్చును- ఒకవేళ శ్రాద్ధమునాచరించక తాంబూల చర్వణాదికమును జేసెనేని రౌరవాదినరకములనుబొందును- తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధములయం దుపరదినప్రాతః కాలమునందంగతిల తర్పణంబుచేయువఱకు తాంబూల చర్వణాదికమును జేయఁగూడదు॥

కారికా॥ శ్లో॥ మృతాశౌచేతథాశ్రాద్ధే మాతాపిత్రోర్మృతాహని।
ఉపవాసేచతాంబూలందివారాత్రౌవిసర్జయేత్॥

తా॥ మృతాశౌచమునందును శ్రాద్ధదివసమునందును తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందును ఉపవాసవ్రతదినములయందును తాంబూలచర్వణంబు ను జేయఁగూడదు॥

ర్పణనిర్ణయము సమాప్తము. చే॥ ల॥ బ॥ బ॥